. శాతు గ్రంథమాలిక .

సంపాదకుఁడు : శ్రీ కృత్తివాస తీర్థులు

# ఋగ్విధి

# ఋగ్వీథి

బ్రహ్మర్షి శ్రీ వేంకటరత్న
ముఖోద్గత ఆంగ్ల సూక్తులు

## శ్రీ దేవులపల్లి కృష్ణ శాస్త్రి
విరచిత పద్యానువాదము

• రాతు వారు •
రాజమహేంద్రవరము

# బ్రహ్మర్షి

ఈ దివ్యర్షి పదమ్ము భారతమునందే పుట్టి యీ ధ్యాత్మికే
చ్ఛా దారిద్ర్యమునన్ నశించు ప్రియశిష్యశ్రేయ మాసించి యా
వేదాంత పథమ్ములన్ గదలిరావే! తాల్చికోనిమ్ము నీ
పాదాంభోజకణాలవమ్ము గురుదేవా, మాశిరోవీధులన్!

ఈ జడజీవితమ్ముఁ బలికించితి, వీయఘ పంకమందు వం
భోజము మొల్వఁజేసితి, వపూర్వము నీదయ, యీనిశిధి నీ
రాజన మెత్తినావు; విపులమ్మగు నీయెద నిండెనే శర
ద్రాజిత చంద్రకాంతు లమృతమ్ములు స్వర్గలతాంతవాసనల్!

నాయెదలోఁ ద్వదీయచరణమ్ముల చిహ్నము లెన్నఁడేనియున్
మాయవ యేనిశీథపుఁ దమస్సులు మూసినఁగాని; జీవయా
త్రాయత వీధినొక్కఁడఁ బ్రయాణము వేయుదు నక్షయంపుఁ బా
థేయముగా గ్రహించి గురుదేవ ముఖప్రసృత గీతికాసుధల్!

మాచిననాఁటి చిత్తము లమాయికకోమలములో, పదేపదే
వూచిన వానిస్వప్నము లపూర్వము, లిప్పటికేని నాఁటినూ
నీచరితామృతమ్ముఁ గురిపించెడు మాగురుదేవుఁ డేలనో
తోఁచు షరాయితో ఫగిడితో నెవరో రయికపాదుశాహిగా!

“ఏ దురితాంధవహ్నుల దహించుకపోవు జడుండ” నంచుఁ బ్ర
హ్లాదుఁడ వీవె శ్రీశుకమహర్షివి నీవె వచింపఁబోవ, నే
పాదురొ వమ్ముపోఁట్లు వెలిపాను; ముఖాముఖి, నో వినమ్రమూ
ర్తీ, దరిశించినాఁడ వగదే జగదీశుని; నెంతవాఁడవో!

అలనాఁటి ఋషివాటికలనుండి వెలితెంచు
నామ్నాయపూతగంగామృతమ్ము;
అలనాఁటి బోధివృక్షాయతచ్ఛాయల
సెలలైన బాష్పశీతలజలమ్ము;

అలనాఁటి కతిప్రోడు సిలువగద్దియమీఁద
సురలిన రక్తకవోష్ణధార;
అలనాఁటి యారబీయుల యెడారులలోనఁ
గాఱిన విశ్వాసఘర్మవారి;
కలిసి నీలోన లోలోనఁగదలి పారఁ
బరసు వాఱిన దయ్య నీహృదయసీమ;
తావకపవిత్రజీవితధామ మైన
దయ్య విశ్వవిశాలదేవాలయమ్ము!

ప్రతిఫల మ్మిసుమంత వలచక కర్మముల్
సేయునీ మెయి కురుక్షేత్ర మగును;
అశాంతములకుఁ జరాచరమ్ములకును
దరలు నీయెడఁద బృందావనమగు;

వివిధధర్మజ్ఞానవేణీసమాశ్లేష
మైన నీమనసు ప్రయాగయగును;
పాతాళమును స్వర్గపద మొక్కముడిలోన
వతుకు నీవే వారణాశి కాదు;
నీవు కన్పడ నెదురుగా నిలిచినట్టె
ప్రోలను పురాణభారతపుణ్యభూమి!
మాకు దినదినదివ్యయాత్రాకృతోత్స
వానుభూతినొసంగు బ్రహ్మర్షి వీవు!!

కృష్ణ శాస్త్రి

The Creator brought into being the Game of Joy; and from the word, "Om", the Creation sprang.

God is one; creation is one; and thus every integral part of creation is one with God and the universe. In His household there is no other enumeration than "One."

Life and death, union and separation, are all His plays of Joy! His play the land and water, the whole Universes! His play the earth and sky! In play is the creation spread out, in play it is established.

ఓమ్

శ్రీమదోంకారనాద వ్యాప్తిమనుండి
యవిరతానంద జీవితోత్సవము దీని
నామహానందనాథుఁడే యలరఁ జేసె
ననుచు నమృతాలయూట బ్రిహ్మర్షిమాట.

ఏ కే శ్వ రుఁ డు

ఈశ్వరుఁ డొకండె, యొక్కటే సృష్టి, ప్రతి వి
శిష్టభాగము నతనితో సృష్టితోడ
నొక్కటే, యొక్కయొక్కటే యున్నది గద
యతనియింట న టంచు బ్రిహ్మర్షిమాట.

ఆ నం ద ము

బ్రితుకు, చావు, కూడిక, యెడఁబాటు, మిన్ను
మన్ను మున్ను రతనియాట; మఱియు సృష్టి
దాననే, దాననే సృష్టి స్థైర్య మూను
ననుచు రతనాలపేట బ్రిహ్మర్షిమాట.

Every flower and every brook is the laughter of His Joy. Every sounding grove is the music of His Joy.

Day and night are but His alternating Joy. Spring and summer, autumn and winter, are His revolving Joy.

The glowing dawn and the rising morn are the first gleams of His returning Joy. The retiring Sun with golden sheen in the west is His retreating Joy to reappear.

అతని యానందహాస లేశాంకురములు
ననలు సొనలును, బ్రితిరణన్మంజుకుంజ
మతని యానందగాన రసార్ద్రిపుంజ
మనుచుఁ గ్రొందేనె తేట బ్రిహ్మర్షి మాట.

పగలు రేయి యామినియు వేసఁగియు సీతు
కారు శిశిరమ్ము నెదు రయి దూరగ మయి
తిరిగి తిరిగి విధవిధాలఁ దరలి వచ్చు
నతనియానంద మనుచు బ్రిహ్మర్షి మాట.

ఎల్లి విచ్చేయుటకె మెల మెల్లఁ జాఁగు
నతని యానంద మగు దివాంతారుణాభ;
యాతని పునరాగతాగ్ర దగతులఁ దెంబ్బ
ప్రిత్యూషశ్శోభ యనుచు బ్రిహ్మర్షి మాట.

The whole world rests in His play, yet still the Player remains unknown.

Like a balmy breeze refreshing the drooping frame, like a charming voice cheering the heavy heart, like a vernal shower bringing the vital sap to the withering plant......is this hope- imparting belief that there is a heavenly Purifier of the fallen.

All give of their possessions; but He gives Himself. Let go the world, and the world lets you go. Let go God and God pursues you all the Keener.

ఆమహానంద ఖేలనమంద విశ్వ
మంతయును సుస్థిరత నిల్చు నైన నించు
కంతయును గాని యెఱుఁగరాఁ డాటగాఁ డ
టంచు నమృతాలయూట బ్రహ్మర్షిమాట.

పతితపావన మూర్తి

సడలు మేనికి వీవవి, బడలు నెదకుఁ
దీయ నగునుడి, వడులు వూఁదీవ కమృత
జీవ మిదు వానజడి, దీనపావనుఁ డతఁ
డమరు ననునాన యనుచు బ్రహ్మర్షిమాట.

తమకలిమినుండి యిత్తు రందఱు నతండు
తన్ను, దానే యొసంగు; నందఱుఁ దొలంగు
మందఱును నిన్నుఁ బాయుదు రతని వీడు
మతఁడు వెన్నాడు ననుచు బ్రహ్మర్షిమాట.

God is a long-suffering God, suffering the heart-ache of the guiltless parent for the prodigal child.

The refreshing showers, the bracing Zephyrs, the entrancing fragrances, the enchanting notes, the enrapturing sights— all are my possessions. I hold them in 'fee simple'.

Who dare call me poor with these imperishable possessions; when God has granted me the 'second sight' of love with which I can behold the flowers as the love-missives of the Beloved.

దోషిన్యై బిడ్డ వెడదారిఁ దోడిఁ బసు నవు
డెన్నఁ డే పాప మెఱుఁగని కన్నతండ్రి
పొగులు నటు యుగంబులనుండి నొగులుచుండు
నఖిలజనకుం డటంచు బ్రహ్మర్షి మాట.

వలపు లని గాలియల లని చలువనీటి
యూట లని పాట లని తేనెతేట లనియు
నూరకయె యెన్ని యెన్ని నా కొదవె నమర
మధురసంపద లనుచు బ్రహ్మర్షి మాట.

ఏమహాసాహసి దరిద్రుఁ డీతఁ డనుచు
ననుఁ బిలుచు; ప్రేమనేత్రము నాది; నాకుఁ
బదపదమ్మునఁ బువు పువు ప్రణయలేఖ
యనుచు నామనిదోట బ్రహ్మర్షి మాట.

All veils are rent, all knots are broken, all barriers are levelled; and in the Garden of Love are seated love-making 'Thou and I'.

Geography calls the spherical orb the Earth; religion calls it the Mother's Bosom. Worship is the child-spirit of repose on that Bosom.

Worship dreams in your dreams; it goes with you wherever you go; it is the test, the index, the measure, whereby to sound the extent to which there is divine nature in you.

ఎల్ల తెరలు తొలంగఁగా, నెల్లముడులు
సడలఁగా, నెల్లయెల్లలు చదును గాఁగ
నీమహానందవనములో 'నీవు నేన'
యనునతఁడు ముక్తుఁ డనుచు బ్రిహ్మర్షి మాట.

ప్రార్థన

ధరణి భూగోళ మంచు శాస్త్రము వచించు;
తల్లివమ్మ యనుచు మతమ్ము పిలుచు;
శిశువవైయె దానిపైని నిశ్చింత నుంట
యతనియారాధన మను బ్రిహ్మర్షి మాట.

నీకలలోఁ గలలు కాంచు, నీవు నిలుచు
నట నిలంబడు, నీదుదివ్యత్వ మెట్టి
దో గ్రిహించును, నూచించుఁ దూఁచు గొలుచు
నతనియర్చన మనుచు బ్రిహ్మర్షి మాట.

It is prayer that ferries the soul across the unknown main and lands it in the haven of the Great Beyond.

Prayer is the lovely angel that fetches the flowers of peace and hope and spreads them on the death-bed.

It is prayer that ushers the suppliant spirit into the august presence of Him who is Immortality itself.

ఆత్మ నజ్ఞాతజలరాశి ననిచి పుచ్చి
స్వర్గసీమాంగణమున నవ్వలితటాన
నునిచి తనియించు తరణి ప్రార్థన మటంచు
నమరపదవికి బాట బ్రిహ్మర్షి మాట.

శాంతినుమముల నాశాలతాంతములను
నందికొని నచ్చి మరణశయ్యాతలమునఁ
బఱచు ప్రియదివ్యతమమాత ప్రార్థనమ్మ
యనుచు నమృతాలయాట బ్రిహ్మర్షి మాట.

తనమననిఁ దెల్పికొనవచ్చు వినమితాత్మఁ
దా నమృతమౌ నతనిసన్నిధానమునకుఁ
బంపఁగలుగు ప్రతీహారి ప్రార్థనమ్మ
యనుచుఁ దేనియ తేట బ్రిహ్మర్షి మాట.

Prayer is a pillar of cloud and a pillar of fire to guide us across the wilderness of this world; it is the unerring clue to the perplexing labyrinth of this life.

Prayer is the royal road to heaven; it is the cipher key for opening the gates of the City of God. It is the passport for prompt admission into abodes of immortality.

Prayer is a nurse in infancy, a comrade in manhood, a consoler in sorrow, a healer in ailment, a companion in adversity.,

ప్రార్థనము లోకికారణ్యపదములందుఁ
బథములం దీర్పు దీపము; బ్రతుకులోని
విడనివ్యూహమ్ము విప్పి తప్పించుమంత్ర
మనుచు రతనాలపేట బ్రహ్మర్షి మాట.

రాజపథము స్వర్గమునకు, రాజరాజు
నగరుమొగసాల తాళమ్ము, పగలు రేయి
పరమధామమ్ముఁ జొరగ నుత్తరువు మనకుఁ
బ్రార్థనమ్మె యటంచు బ్రహ్మర్షి మాట.

బాల్యమున దాది, పరువానఁ బ్రాణసఖుఁడు
కష్టమునఁ దోడునీడ రోగమున మందు
ప్రార్థన మ్మార్తియందు నూఁఅట యటంచు
నమరపదవికి బాట బ్రహ్మర్షి మాట,

This union is, not a lapse into non-being but a rebirth into pure being ... the soul at its holiest puts on the immortal—it does not cease to be; it stands above the flux and reflux of life; it is immortal.

The revolving top at its swiftest 'sleeps' (but not drops); the unchecked stream at its fastest flows still (but is not stagnant); the vivid light at its brightest turns invisible (but is not 'quenched').

Miss the mother, lose the home: miss the Deity, lose the universe. Forsake man the brother, and God the Father is forsaken.

## సం యో గ ము

ఉండకుండుట కాదు సంయోగ మనిన
సకలువస్థితిఁ బునరుదయమ్ము గాని;
చావుబ్రతుకుల దాటి, నిశ్చలత నాత్మ
యమృత మగుఁ గాని యనుచు బ్రహ్మర్షి మాట.

వడిఁ దిరుగు బొంగరమ్ము పర్విడు ఝురమ్ము
శాంతి నిదురించు నిలువ వావంత యేని;
మఱియు మెఱసెడు వెలుఁగు క న్మోడ్చుఁ గాని
యాఱిపోలే దటంచు బ్రహ్మర్షి మాట.

## జగత్పిత-మానవుడు

తల్లిఁ దప్పితివేని నీ కిల్లు లేదు;
ప్రభునిఁ దప్పితివేని విశ్వమ్ము లేదు;
సోదరుని వీడ నీతండ్రియాదరమున
కవుదు దూరుఁడ వనుచు బ్రహ్మర్షి మాట.



4

God, who is in both Heaven and Hell, is the Temple of all Truth.

Truth—a message direct from the throne of God. Pure gold needs no polish and real truth wants not the support of a bruised reed.

For no kind of easy conveyance would we bargain away our own legs; nor shall we cast out our own eyes that we may be safe under a skilful guide.

## సత్యము

నాలోకమునసె కాక నరకకూప
మందుఁ గూడ నున్నాఁడు నీయనుఁగుఁదండ్రి;
యాతఁడే సర్వసత్యాలయమ్మటంచు
నలరుఁదేనియ తేట బ్రహ్మర్షి మాట.

దివ్యసింహాసనమునుండి దిగిన సత్య
వాణి కొఱకై దీనవేణూపదాన్నమేల;
మేల్మిబంగారమున్న కేల మెఱుఁగుఁబూఁత
యనుచు ముత్యాలమూట బ్రహ్మర్షిమాట.

ఎట్టివాహనమునకైన నీపదమ్ము
లమ్ముకోనోర్తువే, కన్ను లార్పికొనఁగ
నేర్తువే యెట్టిమార్గనిర్ణేత కైన
ననుచుఁ గొంతిం దేనెయూట బ్రహ్మర్షి మాట.

He alone who drinks up the 'halahalam' of human sorrows and sufferings can pronounce the benediction—sivam, peace......Siva achieves sivam because He is Hara, the Destroyer of all consuming selfishness.

"I have swallowed the poison that you may have peace and happiness ; I have given up my life, that you may come to full free life".......thus sacrifice is the 'earnest' of salvation.

While light and sound might have sufficed for ordinary life, wisdom and love mellow the one into music and the other into rainbow.

## శి వ ము.

అఖిలమానవలోక మహార్తి యనెడు
దారుణహాలాహాలమ్మును ద్రావు వాఁడె
శివ మనుచు శాంతి యనుచు నాశీర్వదింప
నతఁడె వలఁతి యటంచు బ్రహ్మర్షి మాట.
ఏసుఖముకోసము భుజింతు నేవిసమ్ము,
ఏమనికికోసము త్యజింతు నే 'ననువుల"
నని నిలుచు నమ్మహావిసర్జనమె, ముక్తి
నంద నిడు ముదు పంచు బ్రహ్మర్షి మాట.

## జ్ఞా న ము - ప్రే మ

పలుకు వెలుఁగు సామాన్యజీవులకుఁ జాలు
కాని చాలవు ప్రేమవిజ్ఞానములకు
పలుకు సంగీతముగఁ జేయఁగలుగు దాఁక
వెలుఁగు నింద్రచాపముఁ జేయఁగలుగు దాఁక
ననుచు నామనితోఁట బ్రహ్మర్షి మాట.

As the God of Wisdom, we esteem Him; as the God of Might, we obey Him; even as the God of Holiness, we revere Him; only as the God of Love, do we confide and rejoice in Him.

The soul seeks and God reveals; the soul asks and God grants; the soul knocks and God opens; thus man's desires and God's designs come into line.

What is Religion but the spirit which on the living tablet of the heart with its' ample records of joys and sorrows, engraves at the top "God, the Parent".

జ్ఞానమూర్తిని మన్నింతు, శక్తిమంతు
నానఁ దల నుంతు, పావను నామతింతు,
ప్రణయనాధునికడఁ జనవున వసింతు,
హాయి జీవింతు ననుచు బ్రహ్మర్షి మాట.

ఆత్మ - పరమాత్మ

నేను దట్టఁగఁ దెఱచును దాను, రోయ
నేను దాఁ దోఁచు, నేఁ గోరఁ దా నొసంగు
నతని యేర్పాటు నాయభిమతము నొకటె
యనుచుఁ గొంది దేనె తేట బ్రహ్మర్షి మాట.

మతము

ఎన్ని సుఖదుఃఖగాథలో హృదయఫలక
మందుఁ జిత్రించుకొన్నాఁడు మానవుండు
అన్నిటికిఁ బైని "నతఁడు నాయనఁగుఁదండ్రి"
యనుటయే మత మంచు బ్రహ్మర్షి మాట.

Religion is a music that knows no silence, an aroma that sustains no diminution, a sweetness that suffers no surfeit.

In the dispensations of Him unto whose omnipresent eye the end is disclosed from the beginning, sooner or later, here or hereafter, good is the final goal of ill and every winter changes to spring.

There is not real illusion in this world except this delusion that God deserts any one of us at any time.

వాడిపోవక యెప్పుడు వలచు తావి
వెగటు కాఁబోక యెప్పుడు రగులు తీపి
మూఁగ వోవక యెప్పుడు మ్రోఁగు పాట
మతమె యని తేనెతేట బ్రహ్మర్షి మాట.

తుది మొదలు సర్వ మతని కన్నెదుట నిలుచు,
నతని యేర్పాటులో నెన్నఁడైన నెటనో
మంచిగాఁజెడ్డ, మధువుగా మంచుకారు
మాఱితీరు నటంచు బ్రహ్మర్షి మాట.

ఏనిముసమందునేని నెవ్వానిఁ గాని
యాకృపావార్ధి యెడఁబాయు ననెడునాత్మ
వంచనమె మాయకాని ప్రపంచకమున
మాయయే లేదటంచు బ్రహ్మర్షి మాట.

Morality vivifies religion; religion sanctifies morality. Two sides of the same grand human nature, the negligence of either is the degradation of the other.

Love stoops where righteousness stands stiff and love availeth. Love prevaileth ultimately.

To forgive will become as easy as to give, when we are ruled and guided by the Law of Love......To give I have few opportunities; but to forgive I have almost numberless occasions.

## నీ తి - మ త ము

మతమునకు నీతి యొసఁగు జీవితబలమ్ము,
మతము పూత మ్మొనర్చు సంతతము నీతి,
నొకటి విడిచిన నితరమ్ము వికృత మగును
మానవునిలోన ననుచు బ్రహ్మర్షి మాట.

## నీ తి - ప్రే మ

నీతిపద్ధతి గరువాన నిట్టు నిలుచు
తావులం దెల్లఁ బ్రేమ మస్తకము వంచి
యోర్చి గెలు పొంది పైకొన నేర్చు ననుచు
నలరుఁదేనియ యూట బ్రహ్మర్షి మాట.

ప్రేమశాసనమే నడిపించు జీవి
కివివలె సులభము క్షమియించుటయును,
ఈయఁగఁ గొలందియే, క్షమియింప నెన్నొ
యమరుతరుణము లనుచు బ్రహ్మర్షి మాట.

As the body is endowed with two arms, so is the spirit, too, gifted with two arms. With one arm, Humility, I take hold upon His dear Humanity; with the other arm 'Love' I clasp His Divinity.

Man is but the little ray that has emerged from the central glow of His Joy.

Man is not merely flesh and blood, not even this wonderful machinery which thinks and feels and wills and acts.

మేని కటు రెండె చేతులు మానవాత్మ
కడఁకువయు ప్రేమ; యడఁకువ నదిమిపట్టు
నాతని యనుంగుమానవు; నదిమిపట్టు
నతనినే ప్రేమ ననుచు బ్రహ్మర్షిమాట.

## మా న వు డు

ఆమహానంద కాంతిగర్భాంతరాళ
మందు సముదయ మందుచు నవతరించు
నవనవమయూఖరేఖ మానవుఁ డటంచు
నలరుఁదేనియతేట బ్రహ్మర్షిమాట.

మానవుఁడు రక్తమజ్జాస్థిమాంసరచిత
విగ్రహమె కాదు; భావించి వివిధగతుల
ననుభవించి, నిశ్చయించి, యాచరించు
యంత్రమే కా దటంచు బ్రహ్మర్షిమాట.

Man is the ever-expanding being, beginning as a personality, growing as a reality and culminating as a glory.

Man—the heir of ages past and the architect of centuries to come.

The human soul is a way-farer through the world and has to ascend from darkness into light.

ఆది నొక్క చిన్మూర్తిగా నవతరించి
యల నలన సత్యరూపత నతిశయించి
పూర్ణవైభవమూర్తి సంపూర్తి నందు
నతఁడు మానవుఁ డనుచు బ్రహ్మర్షిమాట.

సాఁగిపోయిన వేలకల్పాల కర్మ
ఫలమహాభాగ్యరాశికి 'భాజనుండు';
రాఁగల యుగాలశిల్పనిర్మాత యైన
యతఁడు మానవుఁ డనుచు బ్రహ్మర్షిమాట.

కారుఁజీఁకటిలో బైలుదేఱి, యమృత
కాంతిఁ గోరి, సతమ్ము లోకమ్ములోఁ బ్ర
యాణ మగుబాటసారి యీమానవాత్మ
యనుచు నమృతాల తేట బ్రహ్మర్షిమాట.

The man of God cannot feel quite distressed, so long as there is a single joyous heart; neither can he feel quite elated, if there is a single sorrow-stricken heart.

What is the home but the lived church, even as the church is the focussed and illumined home.......These are but two halves of one full life.

Sin is of man's frailty; repentance of God's grace. To sin and not to sorrow is to ignore the redeeming Deity.

## భాగవతుఁడు

ఒక్కయెదనైన నానంద మున్నఁ గ్రుంగి
భాగవతుఁ డన్నయాతఁ డేద్వంగఁబోఁడు
ఒక్కగుండియలో దుఃఖ మున్నఁ బాంగి
మై మఱవలేఁ డటంచు బ్రహ్మర్షి మాట.

## గృహము - ఆలయము

నీ వహరహమ్ము వసియించుకోవెల గద
నీగృహము; గుడి దివ్యసందీప్త మైన
గృహమె గద; దాన దీనఁ బూర్తి యగుఁ గాదె
మానవునిబ్రతుకంచు బ్రహ్మర్షి మాట.

## పాపము

పాపము నరునిదౌర్బల్యలోపమె యగు;
నొంచు ననుతాప మీశ్వరానుగ్రహమ్ము;
పాపివా దుఃఖపడు, కృపావార్ధిఁ దాత
నతనిఁ దెగడకు మనుచు బ్రహ్మర్షి మాట.

In God's family, there is no punishment but only purification; unless you hold that the goldsmith who purifies a piece of gold is therein also punishing that piece.

Pardon is not merited; it is not supplicated; but the Divine Mother, out of pure grace and abundant benevolence, says, "no pardon, child; pardon persupposes offence; pardon presupposes anger; pardon presupposes alienation".

Heaven is the intimate companionship of God—Heaven and Hell are not places but principles, not localities but states.

## శిక్ష

దివ్యసంసారముఁ బవిత్రీకరణమె
కాని దండన మనుమాట కానరాదు;
మూసలోఁ బైడి నగసాలె వేసి కాల్ప
నగునె దండన మనుచు బ్రహ్మర్షి మాట.

## క్షమార్పణ

"పాపమా! కోపమా! యెడఁబాటు? నాయ
నా, క్షమార్పణమా!" యను ననుఁగుదల్లి
యడుగవో, యర్హుఁడవు, కావొ యామె కరుణ
యడఁగకే మంచు నంచు బ్రహ్మర్షి మాట.

## స్వర్గము - నరకము

స్వర్గ మీశ్వరసహవాస సంపద యగు,
స్వర్గనరకవాసములు దేశములు కాక
యంతరంగస్థితు లగు, సిద్ధాంతము లగు,
ననుచు నమృతాలతేట బ్రహ్మర్షి మాట.

Hell, too, is the abode of God, because Hell has been described as the Hospital of God, where Love is the Senior physician. What severer punishment does God impose than purifying repentance ?

Detach Home from Heaven, and Home is a prison-cell; detach Heaven from Home, and Heaven is a mirage. Heaven is Home and Home is Heaven.

In the dispensation of God the sinner of to-day may be the saint of tomorrow.

నరక మది దివ్యగేహ, మీశ్వరునివైద్య
ధామ, మద్దానఁ జేరిమపరిధానవైద్యుఁ
డంతరంగసంతాపమే యతనిమందు
మాన్పు దండన మంచు బ్రిహ్మర్షి మాట.

## స్వ ర్గ ము - గే హ ము

స్వర్గముఁ దొఱంగు నిలు చెఱసాల యగును.
ఇలుఁ దొఱఁగుస్వర్గమును మృగతృష్ణ యగును;
ఇల్లె స్వర్గము, స్వర్గమే యిల్లటంచు
నమరపదవికి జాట బ్రిహ్మర్షి మాట.

## పా పి

వింతవింతలుగాఁ దోఁచు విధివిధాన
మందు నీనాఁటి ఘోరపాపాత్ముఁ డేని
రేపు తాపసిగా మాఱనోపు ననుచు
నలరఁ దేనియయూట బ్రిహ్మర్షి మాట.

True faith gives a meaning to life and a purposo to history; without it, the former is but an aimless struggle and the latter but the sport of chance.

The child trusts the father because it cannot help doing so; the wife trusts the husband because she delights to do so.

If woman has to depend upon the man for the sustenance of life, is not man, likewise, dependent upon woman for the sweetness of life; man the stem, woman the creeper; man the sap, woman the flower?



## విశ్వాసము

బ్రతుకు సార్థక మగుఁ, జరిత్రమ్ము కాదె
సప్రయోజన మగును విశ్వాసవశత;
జీవిత మ్మంతయును వట్టి దేవులాట
చరిత చెరలావి యగు నవిశ్వాసకలన
ననుచు పెట్టనికోట బ్రహ్మర్షి మాట.

తా నబల గాన పసిపావ తండ్రి నొకని
నమ్మ కెటులౌను! తనకు నానంద మగుట
భార్య పతియెడ నచలవిశ్వాస మూను
ననుచుఁ దేనియతేట బ్రహ్మర్షి మాట.

మ్రాఁకు పెనుబోఁదె మగవాఁడు మగువ తీగ
నరుఁడు తరుజీవనరసమ్ము తరుణి పూవు;
అచలదార్ఢ్యమ్ము చలువతీయందనమ్ము
మనుగడకు సిద్ధ మనుచు బ్రహ్మర్షి మాట.

Not only should our soul be child-like but also woman or wife-like, before it can enter Paradise.

To regard as a God-send all but what has been wilfully courted is the test of true religion. A true saint is one who minds not the difference between pleasure and pain.

The appeal of the rose is not to the nose but to the God in man..........

స్వర్గసీమాంగణప్రవేశమ్ము మున్న
మనలులే గాదు శిశువుగా మానవాత్మ
నారివలె భార్యవోలె మనంగవలయు
ననుచు నమృతాలయూట బ్రహ్మర్షిమాట.

వలచి వాంఛించినది కాక నిలిచినదియె
యతఁ డిడుప్రసాద మనకొంత మతపరీక్ష;
వోయి యా నార్తి యాను సంయమికి నొకటె
యనుచు రత్నాలపేట, బ్రహ్మర్షిమాట.

మానవుని నాసికను గాదు లోని దేవుఁ
బలుకరించు గులాబిపూ పరిమళమ్ము;
అఖిలమునయందు దివ్యరహస్య మంత్ర
మటులె పఠియింపు మనుచు బ్రహ్మర్షిమాట.

Yonder tower, with mid-day radiance at the top but dark shade at the base, is a graphic symbol of man's life which, rooted in the earth but reared into the heaven, must, and cannot but, be a composite of mundane clay and celestial ray.

What is Providence but the peep of purpose through the cloud of Chance.

We narrowly fancy that the firmament is only here and that as we go out we leave the all-sheltering canopy behind. Now, this is the grand truth that the supposed local is in reality the true universal.

తల తరణిగాంతి నిరులచాయలఁ బదమ్మ
గోపురమునకు మనబ్రితుకునకుఁ గూడ;
కావునవె మన్ను మిన్నుల కలయిక యగు
మానవునిమన్కి- యనుచున్న బ్రిహ్మర్షి మాట.

ప్రతి మాహాద్ఘటనాపయోవహము వెనుక
నొకయమోఘసంకల్ప మేదో తటిత్తు
కరణిఁ దోఁచుట దైవయోగమ్మ గాదె
యనుచు నమృతాల తేట బ్రిహ్మర్షి మాట.

ఇచటనే యున్న దనుకొన్న దెచటనైన
నలరుచుంట యఖండసత్యమ్మగాదె;
అట నిటనుగూడ చాందినీ యగును గాదె
మనకు నాకాశ మనుచు బ్రిహ్మర్షి మాట.

It is ours to plant and God's to grow; ours to till and God's to harvest; ours to serve and God's to bless.

If we attain to that state of God-realisation when we can declare, "where I go, He goes; wherever I am He is."—why, that is Jeevanmukti.

The sacred book of Human Existence opens with the dedication— "To Duty".

## నిష్కామకర్మ

నేను నాఁటిన మోఁక బెంచెదవు నీవు
నేను దున్నిన పొలముఁ బండింతు వీవు
సేవ నాకృషి నీదయ స్వీకరించి
యాలరఁ జేయుట యనుచు బ్రహ్మర్షి మాట.

## జీవన్ముక్తి

"ఏ నటకుఁ బోయినను నతఁ డేఁగుదెంచు,
నే నెచట నున్న నతఁ డటనే వసించు"
నన వలఁతియైన శ్రీపరమేశ్వరానుభవమె
మనకు ముక్తి యటంచు బ్రహ్మర్షి మాట.

## ధర్మము

మానవుని జీవిత మ్మనుమహిత కావ్య
మందుఁ దొలిపత్రమున నె వ్రాయంగఁ బడియె
"తనవిధాయక మగుధర్మమునకె యిద్ది
యంకిత" మ్మని యనుచు బ్రహ్మర్షి మాట.

Duty may at first be struck out as the waters out of the rock but in the end duty oozes as honey from the comb.

Creation is a growth, a richer production, every minute; it never marks time; it never brooks bare repetition.

There is an internal as well as an external Kingdom of God; and He controls the former by persuasion as He sways the latter by command.

తొలుత విధ్యుక్త ధర్మమ్ము శిలలఁ గొట్టి
కైకొను జలమ్ముపోలిక కష్టమగును;
వరుసగా మెల్లమెల్లఁగాఁ బెరల నరలు
నలరఁ దేనె యగా ననుచు బ్రహ్మర్షిమాట.

## సృష్టి

ఒక్కకనురెప్పపాటేని యూరకొనక
యొక్కనలుసంతయును బునరుక్తిఁ గనక
యంతకంతకు వృద్ధియౌ నంతకంత
కందమౌ సృష్టి యంచు బ్రహ్మర్షిమాట.

రాజ్యములు రెండు బహిరంతములు విశ్వ
నాథునివి, పాలనముసేయు బోధనమ్ము
వలన లోపలిదాని, వెల్పలిది స్వామి
యాజ్ఞ నేలు నటంచు బ్రహ్మర్షిమాట.

The Cradle of the Universe is rocked by self-sacrifice......on the cross, the Faithful give up life; at its foot, the Hopeful come into life.

Cultivate—not only the pilgrimage of going out to the sacred places of the earth but the more essential pilgrimage of entering into the inner shrine of the self of yourselves.

Selfishness always dreams of wants, wants are spurs to desires, desires ripen into passions, passions are the fruitful source of all evil. There is no evil but arises out of selfishness. Root that out and you are a true ascetic.

## వి శ్వా ము

జీవిత మ్మిడు విశ్వాసిసిలువమీఁద
సిలువపాదానఁ బుట్టు రాఁగల యతండు;
ఈయిలాఁడోల నూపు నహీనశక్తి
స్వార్థసన్యాస మనుచు బ్రిహ్మర్షి మాట.

## తీ ర్థ యా త్రి

క్షేత్రిములఁ దీర్థముల నీధరిత్రిఁ గొలుచు
మాత్రిమున యాత్రి యౌనా! యాత్మాంతరాళ
పూతపుణ్యస్థలీ పునఃపునర వేక్ష
ణానుభూతియే యనుచు బ్రిహ్మర్షి మాట.

## స్వార్థ నాశస్తు వై రాగ్యమ్

స్వార్థమునఁ గాంక్ష, దానలోభమ్ము, దాన
విషయ లౌల్యమ్ము, దానఁ గల్మషము పెరుగు
స్వార్థము హరింపు సంయమివై చరింపు
మనుచు రత్నాలపేట బ్రిహ్మర్షి మాట.



8

Let us learn only to be nature's princes; and we shall find a pearl in a dew-drop and derive from the meadow grass the delight of an emerald-throne.

Is it not an impressive fact, though a seeming paradox, that strength shows itself to the best advantage when, and only when, it is enlisted in support of weakness?

He is doubly ignorant who is not aware of his own ignorance; and he is doubly pitiable who is not conscious of his own spiritual blindness.

మంచిముత్యమ్ముగా నూఱు మంచుకణము
గరిక నేలయె పచ్చల గద్దె యౌను
సాజముగ రాజువలె మనఁజాలు వాని
కనుచు నామనితోఁట బ్రహ్మర్షి మాట.

ప్రాఁపుగా నిల్చినపుడే దౌర్బల్యమునకు
బలము భవ్యంబుగాఁ గనంబడును గాదె!
ఎంత విపరీతముగఁ దోఁచు నంత సత్య
మగు నిది యటంచుఁ జాటు బ్రహ్మర్షి మాట.

తనయెఱుకలేమి నెఱుఁగఁ జాలనియతండు
రెండువిధములుగ నెఱుక లేనివాఁడు;
తనదు నాధ్యాత్మికాంధ్యమ్ముఁ గననివాఁడు
మఱిమఱిదరిద్రుఁ డనుచు బ్రహ్మర్షి మాట.

Saptapadi adherence to truth, discharge of duty, claims of relations and family, responsibilities of hospitality, service of country, submission to the demands of humanity, dedication to the glorification of the Deity.

With every breath, with every beat of pulse, with every whisper, with every flutter in the air, Thou revealest Thyself into us as the Eternal Companion of each soul.

With every note of song, every glow of hope, every quickening impulse of righteous purpose and pious resolution, thou revealest thyself as the Eternal companion of each soul.

## స ప్త ప ది

సత్యరతి, ధర్మగతి, గృహస్థవిధి, యతిథి
యర్చన, స్వదేశసేవన, మఖిలమాన
వానురక్తి, యీశ్వరభక్తి యని వధూవ
రార్హ సప్తపది యనుచు బ్రహ్మర్షిమాట.

## ఆ రా ధ న

ఊరిచిన, గాలియల నుంత యొత్తిగిలిన,
గుండె మ్రోగిన నేదియో గుసగుస మన
నెదుట సాక్షాత్కరింతు వీవే గదా మ
దాప్తమిత్రుఁడ వనుచు బ్రహ్మర్షి మాట.

ఒక్కచిఱుగీతి విరిసిన నొక్కయాన,
జోతి మెఱసిన నొకమంచి చేత కొక్క
పూతసంకల్ప మొలసిన మ్రోల నిలుచు
ననుఁగుఁజెలి వీవె యనుచు బ్రహ్మర్షి మాట.

The gospels of the world, the chapters of Thy holy message; the prophets of the world, the message-bringers of Thy mercy.

The sages of the world, the crystals through which Thy life passes to the larger humanity; the leaders of the world the index-fingers of Thy light.

The toilers of the world, the caterers and purveyors of Thy benevolence; the sorrowing and the suffering ones of the world the vindicators of Thy compassion.

హే ప్రభూ! వేదవేదము లెల్ల నీయ
మేయనందేశ మందు నధ్యాయము లగు;
నిఖిలలోకప్రవక్తలు నీకటాక్ష
మధురవార్తావహు లను బ్రహ్మర్షి మాట.

జ్ఞాను లందఱు నీదు తేజస్సు నఖిల
ధారుణీస్థలిఁ బఱపునద్దాలు దేవ!
మాకు నాయకు లయ్యు, నీమహిమ జూపు
నచలతజ్ఞను లనుచు బ్రహ్మర్షి మాట.

ఎల్లవేళల నీయావి సీవిశాల
పృథివి శ్రమజీవు లంద అందిచ్చుచుందు;
రేచ్చువా రోర్చువారు తండ్రి, యమోఘ
మందు నీకృప యనుచు బ్రహ్మర్షిమాట.

O, my God, my body I render unto Thee that it may be engaged in Thy service. My mind I offer unto Thee that it may be employed for the propagation of Thy truth.

My heart I dedicate unto Thee that it may, by Thy mercy, be turned into the throne of Love. My soul I wholly surrender unto Thee that, through Thy grace; it may be made a shrine of Thy spirit.

The world is to him (yogi) a crystal palace where he sees God every where. He views naught but sees God's Grace in it. This is vedic yoga.

జీవితేశ్వర, నీపాద సేవకోస
మేను నామేను నర్పింప నీఁగదోయి!
సతము నీదివ్యసత్యమ్ము, జాట నాదు
మనను నొనరింపు మనుచు బ్రహ్మర్షి మాట.

ప్రేమసింహాసనముగ నాహృదయ మలరఁ
గానవా, యాశ్రితావనా, పావనాతి
పావనాలయ మగును నీవే వసింప
నాత్మ వెలిగింపు మనుచు బ్రహ్మర్షి మాట.

ఆ స్తి క యో గి

అంతట ఈశ్వరు నగపడఁ జేయు
నద్దాలమేడ ఈయఖిల లోకమ్ము.
ఆలోన నాతని లీలయే కాక
ఏదియు చూడఁడు వైదిక యోగి.



9

Absorption, silence, meditation, complete self-effacement, self-forgetfulness that is the characteristic of the vedantic Yogi.

Puranic Yogi: To him the world is an epic of God; history is the drama whereof God is the hero; and the soul is the lyric of which God is the subject matter.

Who is a Theist? The theist finds in his God a living deity and a loving father who knocks at the door of every heart, lights the lamp of inspiration in every

వెలుపలి విశ్వమ్ము వీక్షింపఁజోక
లోపలి లోక మాలోకించు వాఁడు,
బహిరింద్రియగుణానుభవమున బోక
తర్కించి తర్కించి ధ్యానించు వాఁడు
తను దా మఱచు వాఁడు, తనయహంకృతిని
విడువఁజాలిన వాఁడు వేదాంతయోగి.

సకలేశ్వరుండు నాయకుఁడైనయట్టి
యొకనాటకమ్ము వానికి చరిత్రమ్ము,
అఖిలనాథుఁడు విషయమైనయట్టి
యొకభావగీతి వానికి మానవాత్మ,
ప్రకృతి యంతయు ఈశ్వరప్రబంధముగ
గ్రహియించు నతఁడె పౌరాణికయోగి.

ప్రతి హృదయాంతరద్వారమ్ముఁదట్టి,
ప్రత్యాత్మ బోధదీపమ్మును బెట్టి,

soul, seeks after and reclaims every wandering sinner. He honours the prophets and seers of all ages and countries; he draws in like gentle gales from distant lands, messages of wisdom and good news of love, from all quarters. For him the finger of providence is working everywhere and the whole universe is one ever-unfolding chart of God's revelation. In spirit he is humble, in the search of truth unbiassed, in the appreciation of wisdom catholic. To him there is no book but may disclose a precious fact, no man but may display a particular phase of God's greatness. He is the heir of all ages, the pupil of all teachers. His admiration for the records of the experiences of the past is reasonable yet

ప్రతిపాపి వెన్నాడి వెతకి చేపట్టి,
ప్రోచుతండ్రిగ మ్రోల దోఁచు దేవునిగ
ఆత్మేశుఁ జూచు శుద్ధాస్తికయోగి.

సకలకాలమ్ముల సకలదేశములఁ
గల పవిత్రుల మహర్షుల గౌరవించి,
ఎల్లతావులనుండి ఏతెంచు ప్రేమ
సందేశములను విజ్ఞానవార్తలను
దిక్కుదిక్కుల వీఁచు తెమ్మెరతెరల
యట్లే గ్రహించు శుద్ధాస్తికయోగి.

వినయ మాత్రీయవర్తనమునయందు,
సమదృష్టి సత్యదర్శనమునయందు,
విపులభావము జ్ఞానవిషయమ్మునందు
అమరినవాఁడె శుద్ధాస్తికయోగి.

profound, and his mission is to distil out, drink and assimilate into himself whatever pure and lovely and of good report in every branch of knowledge. He aspires to the head of a Plato, the heart of a Jesus, the courage of a Luther, the faith of a Chaitanya, the fire of a Mahomed, the self-sacrifice of a Budha.

అఖిలయుగమ్ముల కతఁడు వారసుఁడు,
అఖిలబోధకులకు నతఁడు శిష్యుఁడు,
ఏకావ్యమం దైన ఏదో సత్యమ్ము
ఏజీవియం దైన ఏదో మహాత్తు
నారయునతఁడె శుద్ధాస్తిక యోగి.

తీరిక నెఱుఁగని దేవుని చేతి
నెల్లెడ నతఁ డెప్పు డెదుటనే చూచు;
ఈవిశ్వ మంతయు ఈశ్వరలీల
లెఱిగించు క్రమవికస్వరచిత్రఫలక
మని చూచునతఁడె శుద్ధాస్తిక యోగి.

పూర్వానుభవముల పుణ్యవేదముల
గంభీరరక్తి సకారణయుక్తి
పరికించి గ్రహియించి పరిణమించువాఁడు,
సకలశాస్త్రజ్ఞాన శాఖలనుండి

Neither a cloistered faith that scorns and shuns society, nor a busy careworn faith that assigns the leisure hour to a hurried worship, nor the prudent faith that imports a God to watch a truant world, nor yet a speculative faith that prefixes a creator to a law-governed universe. It was a direct vision of an indwelling Glory, a personal communion with an immanent spirit, an implict trust in an all-regulating providence, a whole-hearted devotion to an all controlling Purpose, a cheerful obedience to an all-governing will, a conscious participation in an all saving Grace, a rapturous delight in an all-entrancing beauty. It was a faith to which the universe was a consecrated temple, the soul a holy

విమలమనోహార విషయసారమ్ము
వడి గట్టి తేర్చి ఆస్వాదానుభూతి
నందెడువాఁడె శుద్ధాస్తికయోగి.

సిద్ధార్థుత్యాగమ్ము జీసస్సునెడఁద
బూథరుకడిమి ప్లేటోధీమహస్సు
గౌరాంగుప్రేమ పైగంబరుమతము
ఆసించువాఁడె శుద్ధాస్తికయోగి.

ఆస్తికమతము

మనుజసంఘము పిశాచమతములో దూరి
యంట ముట్టగనీనియట్టిది కాదు;
అలసి తీరిక చాల దని పని లేని
యప్పు డారాధించునట్టిది కాదు;
గతి తప్పు లోకమ్ము గనిపెట్టు మనుచు
ఆదేవు దిగిచిన యట్టిది కాదు;

shrine, conscience a sacred oracle, duty a divine ordinance, truth the imperishable gospel, love the perfect rule, life a progressive pilgrimage, humanity an abounding grace. It was a faith that interpreted law as the method, force as the will, and matter as the localised potency, of God; It was a faith that esteemed the world as a reflection, the soul as a vision, and history as a panoramic presentation of the nature and the purpose of the deity.

It is the devout supplication that the purposes of Omniscience may be revealed to the eye of faith, and that the will of the worshipper may be broken-in to the ways of the Lord. It denotes the 'felt

శాసనమ్మున నిల్చు జగతికి నష్ట
నంటించు నొకతర్కమట్టిది కాదు;
పలుకరించిన పల్కు పరిభునిలో మెలఁగు
నట్టివిశ్వాసమే యాస్తికమతము.

ఈవిశ్వ మంతయు నీశ్వరాలయము,
ఆత్మ అందలి పవిత్రాంతరాలయము,
అంతఃపరిబోధమే ఆకాశవాణి,
విధ్యుక్తధర్మమ్మె విమలశాసనము,
సత్యమే శాశ్వతాక్షరవేదవాక్కు,
ప్రేమ లోపము లేనిపరియు నియమమ్మె,
బ్రతుకు నిత్యోపాసన పావనయాత్ర,
మానవత్వమ్మె పూర్ణానుగ్రహమ్మె,
అని గ్రహించునది శుద్ధాస్తికమతము.

contract' of man with his God, and marks the process by which the Son willingly merges into the father. It is the feeble, altogether inadequate expression of a divine idea that enraptures the heart.

Worship, according to this theory, is the aspiration that follows the inspiration of God, the admiration that comes of preception, the union that is begotten of 'Sympathy,' the devotion that is induced by love.

ధర్మ మీశ్వరునిపద్ధతిగ గ్రహించి
శక్తినే ఈశ్వరేచ్ఛగ పరికించి,
వస్తు వీశ్వరబల పటిమగా తెలిసి,
అన్వయించునది శుద్ధాస్తికమతము.

ఆతనిప్రతిబింబ మఖిలజగమ్మని,
ఆతని సాక్షాత్సమాలోక మాత్మని,
అతనియుద్దేశప్రకృతులను గూర్చి,
స్పష్ట విస్తృతనిరూపణమే చరిత్ర,
అని గణించునది శుద్ధాస్తికమతము.

అంతర్మహాస్సున కభిముఖ మ్మగుట,
ఆంతరికాత్మతో నైక్యమ్మ గనుట,
అన్నింటి నవరించునవ్విధానమునఁ
బ్రశ్నింపఁబోని విశ్వాసమ్మ గనుట,

అన్నింటి శాసించు నట్టిలక్ష్యమున
కాత్మ సర్వస్వమ్ము సర్పించుకొనుట,
అన్నింటిఁ బాలించు నాయిచ్ఛయందు
అలరు నెమ్మనముతో నడకువ గనుట,
అన్నింటి రక్షించుఆకృపాభావ
దివ్యలీలలలోన తెలిసి పొల్గొనుట,
అన్నింటిఁ బారవశ్యము గూర్చు సుంద
రాచ్ఛవిలాసమం దానంద పడుట —
అనుభవసిద్ధ శుద్ధాస్తికమతము.

మూఁగవోక యెపుడు మ్రోఁగెడిగానమ్ము
వాడిపోక యెపుడు వలచువలపు
వెగటు కాక యెపుడు సొగయించుతీయన
యఁగును నిత్యసత్యమైనమతము.

ఫ ల శ్రు తి

ఎంత వినినను గాని యావంతవినువు
ఎంత చదివినఁగాని రవ్వంత వెగటు
గొనద, యేయమృతమ్ము లోఁ గొననొ కాని
మనకుఁ గొంిదేన తేట బ్రహ్మర్షి మాట.

ఆఱిపోవని దెంతదాహమ్ము నాది
ఆగిపోవని దేలాటియాత్ర నాది
దివివఱకు నిండుకొననిపాథేయ మయ్యె
మాకుఁ జదలేటియూఁట బ్రహ్మర్షి మాట.

ఏ ననదనేమొ నిరుపేద వేమొ నీవు
ఏను చెడుదారినేమొ ఏమేమొ నీవు
రాచబిడ్డల కున్న గౌరవము నిచ్చె
మనకు రతనాలపేఁట బ్రహ్మర్షి మాట.

మూఁడుచిచ్చులు మనసులోఁ గూడువేళ
నేడుగాలులు బ్రతుకులో నెగయువేళ
చలువఁదన మిచ్చు బల మిచ్చు శాంతి నిచ్చు
మనకు వలిమంచుతేట బ్రహ్మర్షి మాట.

తలఁచినప్పుడు వెలుఁగగు, పలికినపుడు
పరమసత్యమ్మె యగు, పనిపాటలందుఁ
బ్రేమ మగు నిత్యమును స్వీకరించుమనకు
నమరపదవికి బాట బ్రహ్మర్షి మాట.

కృష్ణ శాస్త్రి

# ప్రకాశకుల కృతజ్ఞత

సంస్కృత, ప్రాకృత, ఆంధ్ర, హిందీ, ఆంగ్లభాషా విశారదులు, వివిధగ్రంథనిర్మాతలు నగు శ్రీ తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు గారు మాగ్రంథమాలికకు గౌరవ సంపాదకులుగా నుండుట కంగీకరించినందులకు వారికి కృతజ్ఞతాపూర్వక వందనములు.

ఆధునిక కవిచక్రవర్తి లగు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు ఈబుగ్వేధి ప్రథమముద్రణము ప్రకటించుకొనుట కనుజ్ఞ నొసంగినందులకు వారికి మామనఃపూర్వక వందనములు !



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B107 |
| పుస్తకం పేరు | ఋగ్వేళ |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 81 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 2 |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Sdaksh |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |